

# వేణువే స్టెతస్కోప్!

మెడిసిన్ చదవాలన్నది చాలామందికి ఒక స్వప్నం. దాన్ని సాధించడమే వారి జీవితాశయం. అయితే ఎంబిబిఎస్ పూర్తిచేసిన డాక్టర్ వైద్యుల రామచంద్ర మూర్తి తాను చిన్నప్పటి నుంచి నేర్చుకున్న సంగీతాన్నే తన వృత్తిగా స్వీకరించారు... వేణువునే తన ఊపిరిగా మలచుకున్నారు. సినీ సంగీత ప్రపంచంలో ప్రయాణాన్ని కొనసాగిస్తున్న ఈ డాక్టర్‌గారి వేణుగానాన్ని మనమూ విందాం పదండి...

సమ్‌థింగ్ స్పెషల్

''మా నాన్నగారి సొంత ఊరు నల్గొండ జిల్లాలోని మోదుగుల మల్లేపల్లి. నేను పుట్టి పెరిగింది హైదరాబాద్‌లో. మా నాన్న వైద్యుల జయ సుందరరావు గారు జూనియర్ లెక్చరర్‌గా పనిచేసేవారు. మా నాన్నగారి పూర్వీకులంతా ఆయుర్వేద వైద్యులు. నన్ను డాక్టర్‌గా చూడాలన్నది మా నాన్నగారి ఆశయం. గుంటూరులో మెడిసిన్ చేశాను. హౌస్ సర్జన్ ఉస్మానియాలో చేశాను. మా అమ్మ రమాదేవిగారు సంగీతం టీచర్. ఇంట్లో చిన్నప్పటి నుంచి అమ్మ దగ్గర కర్నాటక సంగీతం నేర్చుకున్నాను. చిన్నప్పుడు అమ్మ పాడుతుంటే నేను హార్మోనియం వాయించేవాణ్ణి. మా అమ్మగారి తండ్రి బాబూరావు జోషిగారు భీమ్‌సేన్ జోషి గారి సమకాలికులు. మా తాతగారు హిందుస్తానీ సంగీతంలో గొప్ప విద్వాంసులు. మా మేనమామ జొగావజ్జుల దత్తాత్రేయగారి దగ్గర హిందుస్తానీలో ఫ్లూట్ నేర్చుకున్నాను. నేను వేణువును నేర్చుకోవడానికి గాత్రసంగీతం ఎంతో ఉపయోగపడింది. అలా చిన్నప్పటి నుంచి నేర్చుకున్న సంగీతం నాకు తెలియకుండానే నా జీవితంలో భాగమైపోయింది. అదే నా ప్రధాన వృత్తి కావాలన్న ఆకాంక్ష క్రమంగా బలపడసాగింది.

# వేణువే స్టెతస్కోప్!

మెడిసిన్ చదవాలన్నది చాలామందికి ఒక స్వప్నం. దాన్ని సాధించడమే వారి జీవితాశయం. అయితే ఎంబిబిఎస్ పూర్తిచేసిన డాక్టర్ వైద్యుల రామచంద్రమూర్తి తాను చిన్నప్పటి నుంచి నేర్చుకున్న సంగీతాన్నే తన వృత్తిగా స్వీకరించారు... వేణువునే తన ఊపిరిగా మలచుకున్నారు. సినీ సంగీత ప్రపంచంలో ప్రయాణాన్ని కొనసాగిస్తున్న ఈ డాక్టర్గారి వేణుగానాన్ని మనమూ విందాం పదండి...

"మా నాన్నగారి సొంత ఊరు నల్గొండ జిల్లా లోని మోదుగుల మల్లేపల్లి, నేను పుట్టి పెరిగింది హైదరాబాద్ , మా నాన్న వైద్యుల జయ సుందరరావుగారు జూనియర్ లెక్చరర్గా పనిచేసేవారు. మా నాన్నగారి పూర్వీకులంతా ఆయుర్వేద వైద్యులు. నన్ను డాక్టర్గా చూడాలన్నది మా నాన్నగారి ఆశయం. గుంటూరులో మెడిసిన్ చేశాను. హౌస్ సర్జన్ ఉస్మానియాలో చేశాను. మా అమ్మ రమాదేవిగారు సంగీతం టీచర్. ఇంట్లో చిన్నప్పటి నుంచి అమ్మ దగ్గర కర్నాటక సంగీతం నేర్చుకున్నాను. చిన్నప్పుడు అమ్మ పాడుతుంటే నేను హార్మోనియం వాయించేవాణ్ణి. మా అమ్మగారి తండ్రి బాబూరావు జోషిగారు భీమ్ సేన్ జోషి గారి సమకాలికులు. మా తాతగారు హిందుస్తానీ సంగీతంలో గొప్ప విద్వాంసులు. మా మేనమామ జోగావజ్ఝల దత్తాత్రేయగారి దగ్గర హిందుస్తానీలో ఫ్లూట్ నేర్చుకున్నాను. నేను వేణువును నేర్చుకోవడానికి గాత్రసంగీతం ఎంతో ఉపయోగపడింది.

అలా చిన్నప్పటి నుంచి నేర్చుకున్న సంగీతం నాకు తెలియకుండానే నా జీవితంలో భాగమై పోయింది. అదే నా ప్రధాన వృత్తి కావాలన్న ఆకాంక్ష క్రమంగా బలపడసాగింది.

## మెడిసిన్ చేస్తూనే కచేరీలు

నేను హౌస్ సర్జన్ చేస్తున్న సమయంలోనే మొదటిసారి శోభారాజుగారితో కలసి కచేరీ చేశాను. ఆమెnగాత్రానికి వేణువు సహకారాన్ని అందచేశాను. అక్కడి నుంచి మా మేనమామగారితో కలసిnఆయన సంగీత దర్శకత్వంలో రూపొందే భక్తిnగీతాల క్యాసెట్ల రికార్డింగులకు వెళ్లి ఫ్లూట్ వాయించేవాణ్ణి. అలా ఆ ఏడాదిలో పూర్తిగా బిజీ అయిపోయాను. ఈలోగా మెడిసిన్ పూర్తయిపోయింది. అప్పటికే నా మనసంతా సంగీతం ఆక్రమించుకుపోయింది. మెడిసిన్లో కన్నా సంగీతంలోనే నా జీవనయాత్రను కొనసాగాలని నిర్ణయించుకున్నాను. నాకు బాగా ఇష్టమైనది టీచింగ్. నాకు తెలిసిన సంగీతాన్ని విద్యార్థులకు నేర్పిస్తుంటాను. ప్రతి ఆదివారం మా ఇంట్లో " సంగీత తరగతులు” నిర్వహిస్తుంటాను. వేణువు, గాత్ర సంగీతం, పాటకు స్వరం రాయడం (నొటేషన్స్) వంటివి విద్యార్థులకు ఉచితంగా నేర్పిస్తుంటాను. ఇలా నేర్పించడం వల్ల మనకు తెలిసిన విషయం ఇంకా బాగా అర్థం చేసుకోవడానికి అవకాశం ఏర్పడు

తుంది. దానిపైన పట్టు ఏర్పడుతుంది. దాదాపు పదేళ్ల నుంచి సంగీత క్లాసులు తీసుకుంటున్నాను.

## సినిమా లోకంలో...

నాకు సినిమా పాటల రికార్డింగులు ఎక్కువ ఉంటాయి. సంగీత దర్శకుల వద్ద పూటిస్టుగా రికార్డింగుల్లో పాల్గొంటాను. కొందరు ప్రముఖుల సంగీత దర్శకత్వంలో మ్యూజిక్ కండక్టర్గా పనిచేస్తుంటాను. వయొలిన్ వాద్యకారులకు నోట్స్ రాసి ఇస్తూ, మ్యూజిక్ కండక్ట్ చేస్తుంటాను. వయెలిన్ కళాకారులకు నోట్స్ చెప్పడం చాలా కష్టమైన పని. మొదటి వయొలిన్ బృందానికి ఒక నోట్స్ ఉంటుంది. రెండవ బృందానికి వేరే నోట్స్ ఉంటుంది. వీరందరినీ కలిసి మ్యూజిక్ కండక్ట్ చేయడం ఒక సవాలు లాంటిది. ఆర్పీ పట్నాయక్ గారు సంగీత దర్శకత్వం వహించిన 'నువ్వు లేక నేను లేను' చిత్రంతో మ్యూజిక్ కండక్టర్ నా కెరీర్ ప్రారంభమైంది. ఆర్పీగారి అన్ని సినిమాలకు పనిచేశాను. చక్రిగారి

సినిమాలకు, కీరవాణిగారి సిని మాలకు ప్రస్తుతం ఎక్కువగా పనిచేస్తున్నాను. అక్షయ్కుమార్ నటించిన 'స్పెషల్ 26' అనే హిందీ సిని మాకు కూడా కీరవాణిగారి సంగీత దర్శకత్వంలో. మ్యూజిక్ కండక్టర్గా పనిచేయడంతోపాటు కొన్నిపాటలకు ఫ్లూట్ కూడా వాయించాను. వాద్యకారుల కొరత మన సినిమారంగంలో సంగీత వాద్యకళాకారుల కొరత చాలా ఉంది. రోజుకు కొన్ని వందల మంది గాయనీగాయకులు వస్తున్నారే కాని వాద్యకళాకారులు రావడం లేదు. అలాగే కీబోర్డ్, డ్రమ్స్ లాంటి ఎలెక్ట్రానిక్ వాయిద్యాలను వాయించే కళాకారులు ఉన్నారే కాని ఫ్లూట్, వయొలిన్ లాంటి చేతివాయిద్యాలను వాయించే వారు చాలా తక్కువగా ఉన్నారు. అలాంటి వాద్యకళాకారులను పెద్ద సంఖ్యలో తయారుచేయాలన్నది నా ఆశయం. అందుకోసం భవిష్యత్తులో ఒక సంగీత పాఠశాలను స్థాపించాలన్నది నా కోరిక. అయితే విద్యార్థులలో కూడా వాద్య సంగీతాన్ని నేర్చుకోవాలన్న తపన ఉండాలి. ఏదైనా సాధించాలన్నా తృష్ణ ఉండాలి. అది లేకపోతే ఎన్నేళ్లు

నేర్చుకున్నా సాధించేదేమీ ఉండదు. సాధారణంగా ఒక దశకు చేరుకున్నాక కొత్త విషయాలు నేర్చుకోవాలన్న ఆసక్తి చాలా మందికి ఆగిపోతుంది. కాని అలా జరగకూడదు. సంగీత కళాకారుడు రోజూ సాధన చేయాలి. సంగీతమంటే కేవలం కర్ణాటక, హిందుస్తానీ మాత్రమే కాదు. ప్రపంచంలో పాప్, రాక్, జాజ్ లాంటి ఎన్నో సంగీత రూపాలు ఉన్నాయి. వాటన్నిటినీ వినాలి. అందరి సంగీతాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. అప్పుడే ఒక సంపూర్ణ, పరిపూర్ణ సంగీతకళాకారుడు అవుతాడు. లేకపోతే ఒక విభాగానికే పరిమితం కావలసి వస్తుంది. అలాగే మనకంటూ ప్రతి రోజూ కొన్ని గంటలు కేటాయించుకోవాలి. చదువుకోవడం, సంగీతం వినడం, సాధన చేయడం ఇలా ఏదో ఒక పనిలో ఏకాంతంగా నిమగ్నం కావాలి. సాధ్యమైనంత వరకు మౌనంగా ఒక గంటసేపైనా ఉండగలగాలి. మౌనం మహా శక్తివంతమైనదని నా నమ్మకం. అలా ఉండడం ద్వారా లభించే మానసిక ప్రశాంతత అనిర్వచనీయమైనది. ఓషో, రమణ మహర్షి బోధనలు నన్ను బాగా ప్రభావితం చేశాయి. నా జీవితానికి ఒక అర్థాన్ని తెలియచేశాయి. భగవంతుడికి చేరువ చేసేది... భగవంతుడికి చేరువ కావడానికి, మనల్ని మనం తెలుసుకోవడానికి సంగీతాన్ని మించిన దగ్గర దారి మరొకటి లేదు. స్వయంగా ఆస్వాదిస్తూ, తాదాత్మ్యం చెందుతూ సృష్టించే సంగీతమే శ్రోతలను

ఆకట్టుకోగలదు. పండిట్ హరిప్రసాద్ చౌరసియా నా ఆరాధ్య. అభిమాన సంగీత కళాకారుడు. మా ఫ్లూటిస్టులకు ఆయన దైవసమానులు. అలాగే దర్శకులు కె. విశ్వనాథ్ గారన్నా, ఆయన సినిమాలన్నా నాకు చాలా ఇష్టం. ఎంతోమంది ప్రతిభావంతులైన సంగీత దర్శకులు. మన చిత్ర పరిశ్రమలో ఉన్నందువల్ల వారి దగ్గర నేర్చుకునే అవకాశం మాలాంటి సంగీత కళాకారులకు దక్కుతోంది. తెలుగు పరిశ్రమలోని ప్రముఖులైన మణిశర్మ. రమణ గోగుల, కోటి, కీరవాణి, ఆర్.పి. పట్నాయక్,చక్రి, కె.ఎం. రాధాకృష్ణన్, మిక్కీ జె మేయర్ తదితర సంగీత దర్శకుల దగ్గర పనిచేసే భాగ్యం నాకు దక్కింది. ఇళయరాజా, రహ్మాన్, విద్యాసాగర్ లాంటి ప్రముఖ సంగీత దర్శకుల దగ్గర పనిచేయాలన్నది నా కోరిక. అది త్వరలోనే తీరుతుందని ఆశిస్తున్నాను. నేను ఎంచుకున్న రంగంలో కొనసాగుతున్నందుకు నాకు ఎంతో ఆనందంగా ఉంది. ఎవరికైనా తమకు ఇష్టమైన రంగంలో పనిచేయడం కంటే ఆనందం, సంతృప్తి ఏముంటుంది?" అంటూ ముగించారు. వైద్యుల రామచంద్రమూర్తి. ఆయన ఫోన్ నంబర్:

9247248342

• టి.సుధాకర్




**మనకంటూ ప్రతి రోజూ కొన్ని గంటలు**

**కేటాయించుకోవాలి. చదువుకోవడం,**

**సంగీతం వినడం, సాధన చేయడం ఇలా**

**ఏదో ఒక పనిలో ఏకాంతంగా నిమగ్నం**

**కావాలి. సాధ్యమైనంత వరకు మౌనంగా ఒక**

**గంటసేపైనా ఉండగలగాలి. మౌనం మహా**

**శక్తివంతమైనదని నా నమ్మకం.**

# వేణువే స్టెతస్కోప్!

### మెడిసిన్ చేస్తూనే కచేరీలు

నేను హౌస్ సర్జన్ చేస్తున్న సమయంలోనే మొదటి సారి శోభారాజుగారితో కలసి కచేరీ చేశాను. ఆమె గాత్రానికి వేణువు సహకారాన్ని అందచేశాను. అక్కడి నుంచి మా మేనమామగారితో కలసి ఆయన సంగీత దర్శకత్వంలో రూపొందే భక్తి గీతాల క్యాసెట్ల రికార్డింగులకు వెళ్లి ఫ్లూట్ వాయించేవాణ్ణి. అలా ఆ ఏడాదిలో పూర్తిగా బిజీ అయిపోయాను. ఈలోగా మెడిసిన్ పూర్తయిపోయింది. అప్పటికే నా మనసంతా సంగీతం ఆక్రమించుకుపోయింది. మెడిసిన్‌లో కన్నా సంగీతంలోనే నా జీవనయాత్రను కొనసాగాలని నిర్ణయించుకున్నాను. నాకు బాగా ఇష్టమైనది టీచింగ్. నాకు తెలిసిన సంగీతాన్ని విద్యార్థులకు నేర్పిస్తుంటాను. ప్రతి ఆదివారం మా ఇంట్లో సంగీత తరగతులు నిర్వహిస్తుంటాను. వేణువు, గాత్ర సంగీతం, పాటకు స్వరం రాయడం(నొటేషన్స్) వంటివి విద్యార్థులకు ఉచితంగా నేర్పిస్తుంటాను. ఇలా నేర్పించడం వల్ల మనకు తెలిసిన విషయం ఇంకా బాగా అర్థం చేసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. దానిపైన పట్టు ఏర్పడుతుంది. దాదాపు పదేళ్ల నుంచి సంగీత క్లాసులు తీసుకుంటున్నాను.

### సినిమా లోకంలో...

నాకు సినిమా పాటల రికార్డింగులు ఎక్కువ ఉంటాయి. సంగీత దర్శకుల వద్ద ఫ్లూటిస్టుగా రికార్డింగుల్లో పాల్గొంటాను. కొందరు ప్రముఖుల సంగీత దర్శకత్వంలో మ్యూజిక్ కండక్టర్‌గా పనిచేస్తుంటాను. వయొలిన్ వాద్యకారులకు నోట్స్ రాసి ఇస్తూ, మ్యూజిక్ కండక్ట్ చేస్తుంటాను. వయొలిన్ కళాకారులకు నోట్స్ చెప్పడం చాలా కష్టమైన పని. మొదటి వయొలిన్ బృందానికి ఒక నోట్స్ ఉంటుంది. రెండవ బృందానికి వేరే నోట్స్ ఉంటుంది. వీరందరినీ కలిసి మ్యూజిక్ కండక్ట్ చేయడం ఒక సవాలు లాంటిది. ఆర్పీ పట్నాయక్‌గారు సంగీత దర్శకత్వం వహించిన 'నువ్వు లేక నేను లేను' చిత్రంతో మ్యూజిక్ కండక్టర్‌గా నా కెరీర్ ప్రారంభమైంది. ఆర్పీగారి అన్ని సినిమాలకు పనిచేశాను. చక్రిగారి సినిమాలకు, కీరవాణిగారి సినిమాలకు ప్రస్తుతం ఎక్కువగా పనిచేస్తున్నాను. అక్షయ్ కుమార్ నటించిన 'స్పెషల్ 26' అనే హిందీ సినిమాకు కూడా కీరవాణిగారి సంగీత దర్శకత్వంలో మ్యూజిక్ కండక్టర్‌గా పనిచేయడంతోపాటు కొన్నిపాటలకు ఫ్లూట్ కూడా వాయించాను.

### వాద్యకారుల కొరత

మన సినిమారంగంలో సంగీత వాద్యకళాకారుల కొరత చాలా ఉంది. రోజుకు కొన్ని వందల మంది గాయనీగాయకులు వస్తున్నారే కాని వాద్యకళాకారులు రావడం లేదు. అలాగే కీబోర్డ్, డ్రమ్స్ లాంటి ఎలెక్ట్రానిక్ వాయిద్యాలను వాయించే కళాకారులు ఉన్నారే



> మనకంటూ ప్రతి రోజూ కొన్ని గంటలు కేటాయించుకోవాలి. చదువుకోవడం, సంగీతం వినడం, సాధన చేయడం ఇలా ఏదో ఒక పనిలో ఏకాంతంగా నిమగ్నం కావాలి. సాధ్యమైనంత వరకు మౌనంగా ఒక గంటసేపైనా ఉండగలగాలి. మౌనం మహా శక్తివంతమైనదని నా నమ్మకం.

కాని ఫ్లూట్, వయొలిన్ లాంటి చేతివాయిద్యాలను వాయించే వారు చాలా తక్కువగా ఉన్నారు. అలాంటి వాద్యకళాకారులను పెద్ద సంఖ్యలో తయారుచేయాలన్నది నా ఆశయం. అందుకోసం భవిష్యత్తులో ఒక సంగీత పాఠశాలను స్థాపించాలన్నది నా కోరిక. అయితే విద్యార్థులలో కూడా వాద్య సంగీతాన్ని నేర్చుకోవాలన్న తపన ఉండాలి. ఏదైనా సాధించాలన్నా తృష్ణ ఉండాలి. అది లేకపోతే ఎన్నేళ్లు నేర్చుకున్నా సాధించేదేమీ ఉండదు. సాధారణంగా ఒక దశకు చేరుకున్నాక కొత్త విషయాలు నేర్చుకోవాలన్న ఆసక్తి చాలా మందికి ఆగిపోతుంది. కాని అలా జరగకూడదు. సంగీత కళాకారుడు రోజూ సాధన చేయాలి. సంగీతమంటే కేవలం కర్ణాటక, హిందుస్తానీ మాత్రమే కాదు. ప్రపంచంలో పాప్, రాక్, జాజ్ లాంటి ఎన్నో సంగీత రూపాలు ఉన్నాయి. వాటన్నిటినీ వినాలి. అందరి సంగీతాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. అప్పుడే ఒక సంపూర్ణ, పరిపూర్ణ సంగీతకళాకారుడు అవుతాడు. లేకపోతే ఒక విభాగానికే పరిమితం కావలసి వస్తుంది. అలాగే మనకంటూ ప్రతి రోజూ కొన్ని గంటలు కేటాయించుకోవాలి. చదువుకోవడం, సంగీతం వినడం, సాధన చేయడం ఇలా ఏదో ఒక పనిలో ఏకాంతంగా నిమగ్నం కావాలి. సాధ్యమైనంత వరకు మౌనంగా ఒక గంటసేపైనా ఉండగలగాలి. మౌనం మహా శక్తివంతమైనదని నా నమ్మకం. అలా ఉండడం ద్వారా లభించే మానసిక ప్రశాంతత అనిర్వచనీయమైనది. ఓషో, రమణ మహర్షి బోధనలు నన్ను బాగా ప్రభావితం చేశాయి. నా జీవితానికి ఒక అర్థాన్ని తెలియచేశాయి.

### భగవంతుడికి చేరువ చేసేది...

భగవంతుడికి చేరువ కావడానికి, మనల్ని మనం తెలుసుకోవడానికి సంగీతాన్ని మించిన దగ్గర దారి మరొకటి లేదు. స్వయంగా ఆస్వాదిస్తూ, తాదాత్మ్యం చెందుతూ సృష్టించే సంగీతమే శ్రోతలను ఆకట్టుకోగలదు. పండిట్ హరిప్రసాద్ చౌరసియా నా ఆరాధ్య, అభిమాన సంగీత కళాకారుడు. మా ఫ్లూటిస్టులకు ఆయన దైవసమానులు. అలాగే దర్శకులు కె.విశ్వనాథ్ గారన్నా, ఆయన సినిమాలన్నా నాకు చాలా ఇష్టం. ఎంతోమంది ప్రతిభావంతులైన సంగీత దర్శకులు మన చిత్ర పరిశ్రమలో ఉన్నందువల్ల వారి దగ్గర నేర్చుకునే అవకాశం మాలాంటి సంగీత కళాకారులకు దక్కుతోంది. తెలుగు పరిశ్రమలోని ప్రముఖులైన మణిశర్మ, రమణ గోగుల, కోటి, కీరవాణి, ఆర్.పి. పట్నాయక్, చక్రి, కె.ఎం. రాధాకృష్ణన్, మిక్కీ జె మేయర్ తదితర సంగీత దర్శకుల దగ్గర పనిచేసే భాగ్యం నాకు దక్కింది. ఇళయరాజా, రహ్మాన్, విద్యాసాగర్ లాంటి ప్రముఖ సంగీత దర్శకుల దగ్గర పనిచేయాలన్నది నా కోరిక. అది త్వరలోనే తీరుతుందని ఆశిస్తున్నాను. నేను ఎంచుకున్న రంగంలో కొనసాగుతున్నందుకు నాకు ఎంతో ఆనందంగా ఉంది. ఎవరికైనా తమకు ఇష్టమైన రంగంలో పనిచేయడం కంటే ఆనందం, సంతృప్తి ఏముంటుంది?'' అంటూ ముగించారు వైద్యుల రామచంద్రమూర్తి. ఆయన ఫోన్ నంబర్: 9247248342

• టి.సుధాకర్